శ్రీరస్తు.

శ్రీమతే రామానుజాయనమః.

# తిరుమన్త్రార్థసార ఘట్టము.

## ఉడయవరుల యెనిమిదవ యుత్సవ ప్రభావము.



ఈ గ్రంథము అనేక పురాతన,
ద్రావిడభాష తాళపత్ర గ్రంథముల పరిశీలించి
సులభోపాయముగ ఆన్ధ్రంబున వచనరూపముగ
బుక్కపట్టణము - వరదరాజయ్యగారి కుమారుడగు
బుక్కపట్టణము - రాఘవదాసుచే వ్రాయబడి

శ్రీమాన్.
కోమండూరి- రామానుజాచార్యులచే పరిష్కరింపఁబడి,
తిరువళ్లూరు. మెంటా- వెంకటేశ శ్రేష్ఠిగారి సహాయమువల
చెన్నపట్టణము పాతచాకలపేటయందుండు
పమ్మి - త్యాగరాయ సెట్టిగారి
శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు
ముద్రించి ప్రకటింపఁబడియె.

౧౯౧౫ సం.

# శ్రీరస్తు.

---

## శ్రీమతేరామానుజాయనమః.

## ఉడయవరుల యెనిమిదవ యుత్సవ ప్రభావము

## తిరుమన్త్రార్థ సారఘట్టము.

---

రామానుజులవారు పెరియనంబిగారి తిరుమాళిఘకు వేంచేసి వారితిరువడిఘళకు తాళుం తడకఱియుంకూప్పి దండములు సమర్పించి అడియేనికి దేవరవారి తిరువుళ్లమందుండు అర్థవిశేషములను ప్రసాదించవలయునని ప్రపత్తియుంచగా నంబిగారు అట్లేచేయుదునుగాక యని.

అహోద్వయస్య మహాత్మ్య మహావీర్య మహాబలం। మంత్రరత్నం శుభకరం వేదసారం సనాతనం।సర్వపాపక్షయకరం సర్వపుణ్య వివర్ధనం। శ్రీకరం లోకవశ్యంచ సద్యస్సంసారతారకం॥ అనునట్లు పాపహరమయినటువంటిన్ని పుణ్యవివర్ధకమయి సంసారబంధమును నశింపుజేయుటకు శ్లాఘింపబడ్డ వేదసార తమమయినటువంటిన్ని, మాంగల్య

కర మంత్రరత్నమగుద్వయార్థమును సవిశేషముగ సాయించి రామానుజులవారినిజూచి ఇకకొన్ని అర్థవిశేషములున్నవి అవి ఆళవందారియొక్క (అభిమాన) అంతర్యాతులయినటువంటి తిరుకోట్టియూరు నంబిగారి సన్నిధికిబోయి కోరమని సాయించిరి.

అందులపై రామానుజులవారు తిరుకోట్టి యూరుకు వేంచేసి అచ్చటి నివాసులగు వారిని జూచి తిరుకోట్టియూరు నంబిగారి తిరుమాళిఘ యెచ్చటయని యడుగగా (వారు) అందలి యగుపడు తిరుమాళిఘయన అచ్చోటి నుండి దండప్రణామములు సమర్పించు కొనుచు వారి తిరుమాళిఘకు బోయి తిరుకోట్టియూరు నంబిగారి తిరువడిఘళకు సాష్టాంగ దండములు సమర్పించి అడియేనికి దేవరవారి తిరువుళ్లమందుండు రహస్యార్థ విశేషములెల్లను సాయించవలయునని విన్నపముజేయ వీర యభిప్రాయ బాహుళ్యము తెలుసుకోవలెనని భావించి యెవరికిని నేను చెప్పుటలేదని ముఖమిప్పించక వేంచేసిరి అందులపై రామానుజులవారు (మరలి) శ్రీరంగమునకు వేంచేసిరి.

కొన్నిదినములకావల తిరుకోట్టియూరు నంబిగారు శ్రీ

రంగమందు నంబెరుమాళ్ల యుత్సవమునకు వేంచేసి నంబెరుమాళ్లను సేవించి తిరుగు సమయములో (నంబెరుమాళ్లు) తిరుకోట్టియూరునంబిగారికి అరుళప్పాడిట్టు తిరుమాలై తిరుపరివట్టము తీర్థము శఠగోపము సాయించి (మన యిలయాళ్వారులగు) రామానుజులకు రహస్యార్థ విశేషములు ఉపదేశించుమని (అర్చకముఖేన) నియమించినపై తిరుకోట్టియూరు నంబిగారు సాయించినదేమనగా.

("నసంవత్సర వాసినే ప్రబ్రూయాత్") యనిన్ని ("ఇదం తేనాతపస్కాయ నాభక్తాయ కదాచన। నచాశుశ్రూషవే వాచ్యం నచమాం యోభ్యసూయతే") యని దేవరవారే సాయించి యున్నారుగదా (యనిన) తిరుకోట్టియూరు నంబిగారు నంబెరుమాళ్లకు విన్నపము జేయ అవి నిశ్చయమేయని (శరీరం వసువిజ్ఞానం వాసః కర్మగుణానసూన్) (యని) ఆరంభించి చెప్పియున్న (శిష్యలక్షణ పూర్తి కలిగిన) ఉడయవరులకు చెప్పుటకు నేదొకటి కొదువలేదని సాయించినపై నంబిగారు ఉడయవరులను కటాక్షించి తిరుకోట్టియూరుకు రమ్మని ఆజ్ఞాపించి బయలుదేరిపోయిరి ఆవల రామానుజులవారు తిరుకోట్టియూరుకు పదిహేడు యావ

ర్థులుపోగా నొకొక సమయమున నొకొక అర్థమును సాధించిన విధం జెప్పెన్నను.

౧. (ముముక్షువగుటకు సంసారబీజము నశింపజేయవలయు)

సంసారబీజము నశించుటకు కారణము (పంకాద్యుత్పత్తితే కీటం కీటం పంకం నపశ్యతే। లోకాద్యుత్పత్తితేజ్ఞాని జ్ఞానీలోకం నపశ్యతే) అని చెప్పిన మేఱకు కుమ్మర పురుగు బురదయందు పుట్టియు యా బురదనుండి ఆ పురుగు బయటికి వచ్చినతోడనే ఆ బురద ఆ పురుగుకు అంటక యుండు నట్లు సంసారబీజమును నశింపజేయవలయు) అట్లు నశించిన మాత్రమే నీవుకోరిన అర్థము లభించును.

౨. (అహంకార మమకార నివృత్తి చేయవలయు)

అహంకార మమకారమనగా అహంకారము=గర్వము, మమకార మనగా = మాత్సర్యము, (అగ్నిర్వ్యాపకదీపంచ శైత్యాం గర్వ వివర్జయేత్) అనునటుల అగ్నివల్ల కలిగిన "జ్యోతి" శీతలమగు గాలిచే ఆరిపోవునట్లు అహంకార మమకార నివృత్తి చేయవలయు యా అహంకార మమకారము పోక నీవు కోరినవి లభించవు.

౩. (దేహాభిమానం పోగొట్టవలయు)

దేహాభిమానం పోకనే ఆత్మజ్ఞానం కలుగదు.

౪. (ఆత్మజ్ఞానం కలుగవలయు)

ఆత్మజ్ఞానం లభించని యెడల ఐశ్వర్యభోగాది విషయములయందు ఉపేక్ష కలుగనేరదు.

౫. (ఐశ్వర్యభోగాది విషయముల ఉపేక్ష చేయవలయు)

అట్లు ఉపేక్ష చేయనియెడల భగవత్ప్రేమ కలుగనేరదు.

౬. (భగవత్ప్రేమ కలుగవలయు)

అట్టి భగవత్ప్రేమ కలుగకయే విషయాంతర రుచి విడువదు.

౭. (విషయాంతర రుచివిడువ వలయు)

విషయాంతర రుచి విడువక పారతంత్ర్యము కలుగనేరదు.

౮. (పారతంత్ర్యము కలుగవలయు)

పారతంత్ర్యము కలుగక అర్థ, కామ, రాగద్వేషాది విషయములు పోదు.

౯. (అర్థకామరాగద్వేషములను పోగొట్టవలయు)

అర్థకామ రాగద్వేషములుపోక వైష్ణవము చేకూడదు.

౧౦. (శ్రీవైష్ణవత్వం కలుగవలయు)

వైష్ణవము కలుగక సాత్త్వీక పరిగ్రహం పుట్టదు.

౧౧. (సాత్త్వీక పరిగ్రహము కలుగవలయు)

సాత్త్వీక పరిగ్రహము కలుగక భాగవత పరిగ్రహము పుట్టదు.

౧౨. (భాగవత పరిగ్రహం కావలయు)

భాగవత పరిగ్రహం కలుగక భగవత్పరిగ్రహము పుట్టదు.

౧౩. (భగవత్పరిగ్రహం కలుగవలయు)

భగవత్పరిగ్రహము చేకూడక అనన్య ప్రయోజనకుడు కాడు.

౧౪. (అనన్య ప్రయోజనకుడు కావలయు)

అనన్య ప్రయోజనకుడు కాని యెడల అనన్యార్హ శేషభూతుడు కాడు.

౧౫. (అనన్యార్హ శేషభూతుడు కావలయు)

అనన్యార్హ శేషభూతుడు కాక అనన్యార్హ శరణ్యుడు కాడు.

౧౬. (అనన్యార్హ శరణ్యుడు కావలయు)

అనన్యార్హ శరణ్యుడు కాక అధికార పురుషుడు కాడు.

౧౭. (అధికార పురుషుడు కావలయు)

అధికార పురుషుడు కాని యెడల తిరుమంత్రార్థము చేకూడదు.

ఇట్లు పదిహేడు యావర్తులు తిరుకోట్టియూరు నంబిగారి సన్నిధికి వేంచేసి (పదిహేడు అర్థములు గ్రహించినపై) ఇరల తిరుకోట్టియూరుకు బోయి వారి తిరువడిఘళకు తాళుం తడకైయుం కూప్పి దండములు సమర్పించి నిలచియుండు సమయమున నంబిగారు వీరి దృఢాధ్యవసాయ పరీక్షార్థమునకై నొకటియు సాయించక ఉపేక్షించియుండిరి రామానుజులవారు పెనుఆర్తితో (ఇడైమలర్ కణ్ణీర్ తళుంబ యనునటుల మరలి) శ్రీరంగమునకు వేంచేసిరి. ఇట్లుండు సమయములో తిరుకోట్టియూరు నంబిగారి ప్రియశిష్యులగు నొక శ్రీవైష్ణవాగ్రణి నంబెరుమాళ్లను సేవించు నిమిత్తార్థమై శ్రీరంగమునకు వేంచేసి నంబెరుమాళ్లను సేవించుకొని తిరిగిపోవు సమయమున ఉడయవరుల మఠమునకు వేంచేసి దండములు సమర్పించి నిలచి యుండగా రామానుజులవారు

తిరుకోట్టియూరు నుండి వేంచేసిన ఆ భాగవత శిఖామణితో తన యొక్క దృఢాధ్యవసాయమును (గొప్ప) ఆర్తితో సాయించిన దేమనగా (పూంతండుళాయ్ ముడియార్కు-తక్క-వల్ల పొన్నాళ్ శ్రీ కైయ్యారుక్కు- తక్క-వల్ల). యని విన్నపము చేసినపై యా శ్రీవైష్ణవ శిఖామణి తిరుకోట్టియూరు నంబిగారి సన్నిధికి వేంచేసి దండములు సమర్పించి రామానుజులవారు విన్నపము జేసికొనిన అభిప్రాయములను విశద పరచగా తిరుకోట్టియూరు నంబిగారు మిగులసంతోషించి (రామానుజులకు) యిట్టి ఆర్తి యున్నదిగదా యనిభావించి వచ్చిన యా శ్రీవైష్ణవోత్తమునితో (మరల) నీవుపోయి రామానుజులవారిని దండ పవిత్రములతో (మిన్న్మలను) యొంటరిగా రమ్మనుని చెప్పి పంపిరి ఆ శ్రీవైష్ణవ శిఖామణి శ్రీరంగమందుండు రామానుజులవారి మఠమునకుబోయి రామానుజులవారికి దండములుసమర్పించి నంబిగారు సాయించిన మేలుకు తెలియచేసినపై రామానుజులవారు మిగుల ప్రోత్సాహముతో ఆశ్రీవైష్ణవాగ్రణికిదండములుసమర్పించి కూరత్తాళ్వారులను మొదలియాండానును పిలచుకొని అతిత్వరితగతితో తిరుకోట్టియూరుకుబోయి తిరుకోట్టియూరు నంబిగారి తిరువ

డిఘళకు దండప్రణామములు సమర్పించినిలచియుండగా నంబిగారు రామానుజులను కటాక్షించి నిన్నుమొకరి నేకదా రహస్యముని చెప్పిపంపితిని ప్రస్తుతమున వీరలిరువురిని వెంటబెట్టుక వచ్చుటకు కారణమేమన్న (రామానుజులవారు సాయించిన జేయనగా) మీరు దండపవిత్రములతోరమ్మనని సాయించిబంపితిరి అందులపై (అడియేని) వీరలను దండ పవిత్రమని (భావించి) పిలచుక వచ్చితినని విన్నపము జేయ తిరుకోట్టియూరునంబిగారు రామానుజులను కటాక్షించి యీయిరువురిలో దండమెవరు పవిత్రమెవరని యడుగగా, రామానుజులవారు ముదలియాండానునిజూపి (వీరు) త్రిదండమని కూరత్తాళ్వారునుజూపి (వీరు) పవిత్రమని విన్నపముచేయ (తిరుకోట్టియూరునంబిగారు) అయినను యీరహస్యమును వీరుతప్ప మరియొకరికిచెప్పక గ్రహించుమని తమ తిరువడిఘళను పట్టుకొమ్మని చూళరవుకొండు తమ పరమకృపచేత (ప్రణవాద్యం నమోమద్యం నారాయణ పదాంతిమం। మంత్రమష్టాక్షరం విద్యాత్సర్వసిద్ధికరం సదా। ముముక్షూణాం సదా జప్యం భుక్తిముక్తిఫలప్రదం। వైష్ణవానాం సదాజప్యం భక్తిజ్ఞాన ప్రవర్ధనం) అనునట్లుసాయించి ముముక్షువైనచేతనునికి మోక్షా

పేక్షకలిగినప్పుడు తన్మోక్షో పాయమైన మంత్రరాజమహిమ తెలియుసమయమున (సర్వార్థో వేదగర్భస్తు వేదవష్టాక్షర స్థితః అష్టాక్షరస్తుప్రణవే ప్రణవే అకారస్థితః) మంత్రరాజమైన (ప్రణవం) తత్ప్రణవమూలమైనది (అకారం) అఖిల దేవతామూలము శ్రీహరి గనుక పంచాశద్వర్ణాత్మకమైన పర బ్రహ్మవాచకము (అకారము) సకలవర్ణమూలముగనుక ప్రణవశివాసము శ్రీహరివాచకమాయెను. శ్రీహరియందుండు భావములన్నియు అకారమున కర్థమవును (అక్షరాణా మకారోస్మి) శ్రీహరి తామే గీతయందు సాయించి యున్నారు. తమయందుగల అర్థమంతా అకారమందుకలదు సకలార్థమైన అర్థపంచకమునందు అకారము వెలయు అది యెట్లన్నను అకారమందలి అర్థపంచక వివరము శ్రీమన్నారాయణుండే సర్వశేషిన్ని సర్వరక్షకుడున్ను సమస్తకల్యాణ గుణాకరుండగు శ్రియఃపతియుని అకారము చెప్పుచున్నది అకారమందు గల అర్థమంతయు అర్థపంచక మందుండును (యెట్లన్నను) (శేషమస్యా స్థితిశ్శేషి) అని సర్వశేషియన్న శబ్దమువల్ల స్వస్వరూపము తేటపడును. సకలాత్మలు అతనికి శేషము గనుక (దానభూతా స్వతస్సర్వే ఆత్మానః పరమాత్మనః) అని

స్వస్వరూపమైన తానతనికి శేషమాటచేత స్వస్వరూపమును జెప్పెను రక్షకత్వ సామార్థ్యం కలిగినవాడే పరబ్రహ్మము గనుక సర్వరక్షకుడన్న శబ్దమువల్ల పరస్వరూపము చెప్పను (అవరక్షణే) అనుధాతువుచేత అఖిలకల్యాణగుణాకరుండును సమస్త కల్యాణాత్మక శబ్దమువల్ల ఉపాయ స్వరూపము అందే విరోధిపరిహారమున్ను జెప్పను. సర్వరక్షకత్వసామార్థ్యం గలిగిన, నతండే సర్వసంపత్కరుండుగనక శ్రియఃపతిత్వ శబ్దమువలన పురుషార్థస్వరూపము జెప్పి అన్వయించును.. ఇట్టి అకారము ఆదిగా గలిగిన వర్ణత్రయోక్తమైన ప్రణవమందు అర్థపంచక వివరమెట్లన్నను (మకారో జీవవాచకః) అని మకారమందు స్వస్వరూపమున్ను (అక్షరాణామకారోస్మి) అనిన్ని (అకారార్థోవిష్ణు) అనిన్ని (అకారో వాసుదేవశ్చ) అనిన్ని అకారమందు పరస్వరూపమున్ను ఆయకారమందలి లుప్తచతుర్థియందు పురుషార్థస్వరూపమున్ను (లక్ష్మీశ్చోకారముచ్యతే) అనిన్ని (ఉకార శ్రియతిస్మృతః) అనిన్ని ఉకారమందు ఉపాయస్వరూపమున్ను అన్యశేష నివృత్తినైన విరోధి నివృత్తిఅన్వయించును ప్రణవవివరమైనమంత్రమందలి అర్థపంచక వివర మెట్లన్నను మకారార్థ వివరణ

మైన నారపద మందు స్వస్వరూపమున్ను అకారార్థ వివర ణమైన అయినపద మందు పరస్వరూపమున్ను అకార మంద లి లుప్తచతుర్థి వివరణమైన ఆయపదమందు పురుషార్థ స్వ రూపమున్ను ఉకారవివరణమైన నమః పదమందు ఉపాయ స్వరూపమున్ను విరోధి నివృత్తిన్ని చెప్పి అన్వయించును.

భగవ ద్వివరణమైన అకారమందున్ను అకార వివరణ మైన ప్రణవమందున్ను ప్రణవ వివరణమైన మంత్రమందు ఈ పంచార్థములుం గని తన్మంత్రవివరణమైన అర్థపంచకమందు వున్నట్టే తెలిసి ఉజ్జీవించినవారే జ్ఞానాధికులుయని సాయిం చినపై రామానుజులవారు కృతార్థులై మరుసటిదినమున ఆవూరియందు వేంచేసియుండు స్వామిసన్నిధి గోపుర సమీపమందుండు పరమభాగవతులకు అప్పరమరహస్యా ర్థమును బయలు పరచిరి.

యీ విషయమును తిరుకోట్టియూరు నంబిగారు విని రామానుజలవారిని పిలువనంపి యీగోప్యరహస్యమును యె వరికి చెప్పకుయనిగదా మీకుచెప్పినది వాటినిమలచి నీరు అనేక భాగవతులకు చెప్పినట్లు వింటిని. యన రామానుజు లవారు అవి నిశ్చయమే దేవరవారి తిరువడిఘళును ముందు

యుంచుకొనిమే, నేను వెల్లడిజేసితిని. యనిన నంబిగారు స్వామించినదేమనగా నేనుమెవరికిని చెప్పకుమని చెప్పియుం డగా వాటినితప్పి నీవు చెప్పినందుకై ఫలమేవన్న ఆచార్యుల ఆజ్ఞకు తప్పిన నాకు నరకమే ఫలము అనిన యిట్లు తెలిసియు చెప్పుటకు కారణ మేమనగా అడియేని ఒకడేకదా నరకము నకు పోవడముదేవరవారి తిరువడిఘళను ముందుయుంచుకొ ని చెప్పినందుకై యీఆత్మ కోటియంతయు దేవరవారి తిరు వడిగళు సంబంధమునుపట్టి ఉజ్జీవింతురని గదా యని చెప్పితిని అని విన్నపముజేయు యిట్టి పరసమృద్ధి నాకు లేదుగదా య ని మిగుల సంతోషించి యెంబెరుమానారో యని కౌగలిం చుకొని (వారే మీరనిచెప్పి) యిద్దర్శనము యిదివరలో పర మ వైదిక సిద్ధాంతముగా యుండెను. నేటమొదలు యెంబె రుమానారు దర్శనమని ఖ్యాపించి అవలింభించుడు యని మం గళా శాసనముజేసి తిరుకోట్టి యూరునంబిగారు యెంబెరు మానార్లను తమపరమకృపచే మంగళాశాసనము జేసిరి.

· తిరుకోట్టియూరునంబిగారి తిరువడిఘళే శరణమ్.



## పుస్తకములజాబితా.

| | | | |
|---|---|---|---|
| ఆనందరామాయణము వచనము. | ౧ | ౦ | ౦ |
| సున్దరకాండము, ఆంధ్రతాత్పర్యసహితము. | ౧ | ౦ | ౦ |
| భగవద్గీత ఆంధ్రతాత్పర్యసహితము. | ౦ | ౧౪ | ౦ |
| విష్ణుపురాణం టీకాసహితము. | ౧ | ౫ | ౦ |
| దశావతారచరిత్రము పద్యకావ్యము. | ౧ | ౭ | ౦ |
| గురుశిష్యసంవాద వైద్యచింతామణి. | ౧ | ౧౩ | ౦ |
| శ్రీమద్రామానుజచరిత్రము. | ౧ | ౯ | ౦ |
| శ్రీసుదర్శన రామానుజదాసు కీర్తనలు. | ౧ | ౦ | ౦ |
| శ్రీలక్ష్మీస్తోత్ర రత్నత్రయము, టీకా తాత్పర్యసహితము. | ౦ | ౧౩ | ౦ |
| ముముక్షుజనకల్పకము. | ౦ | ౬ | ౦ |
| శ్రీమన్నారాయణ స్తోత్రకదంబము. | ౦ | ౩ | ౦ |
| భగవద్గీత వచనము. | ౦ | ౪ | ౦ |

ఇంకను అనేక సంస్కృతాంధ్ర గ్రంథములు దొరకును. వలయువారు దిగువ విలాసమునకు వ్రాసికొనవలయును.

 పమ్మి - త్యాగరాయ సెట్టి.

శ్రీరాజరాజేశ్వరీ నికేతన ప్రెస్,

పాతచాకలపేట మద్రాసు.